పెరట్లో కోడిపిల్లల్ని తరిమి తరిమి కొట్టడంతోటి పప్పీకి (కుక్క పిల్లకి) మొహం మొత్తింది.

''అడివి పిట్టల్ని, జంతువుల్ని వాటి జాడపట్టి పసికట్ట బోతున్నాను'' అనుకొంది అది.

అంచేత అది గేటు కిందనుంచి మెల్లిగా జారి పచ్చికమైదానం కేసి దౌడు తీసింది.

అది అలా పరిగెడుతూ వుంటే అడివి జంతువులూ, పిట్టలూ, పురుగులూ దాన్ని చూశాయి. ప్రతీదీ తనకిగా తను అనుకొంది:

''నేను దీనికి ఠోకరా యిస్తాను'' అనుకొంది తుంపాడి పక్షి.

''నేను దీనికి ఆశ్చర్యం కలిగిస్తాను'' అనుకొంది తురాయి పక్షి.

''నేను దీన్ని ఝడిపిస్తాను'' అనుకొంది వంకరమెడ పిట్ట.

''నేను దీనికంట పడకుండా తప్పించుకుంటాను'' అనుకొంది బల్లి.

''మేము దీన్నుంచి దాంకుంటాం'' అనుకున్నాయి గొంగళీపురుగులు, సీతాకోక చిలకలు, మిడతలు.

''నేను దీన్ని తరిమేస్తాను'' అనుకొంది బొంబార్డియర్ కందిరీగ.

''యెవళ్ల పద్ధతిలో వాళ్లుగా, మేమందరమూ కలిసి నిలబడతాం'' అని అవన్నీ అనుకున్నాయి.

యీ లోపున పప్పీ చెరువు దగ్గరికి పరిగెత్తుకెళ్లింది. రెల్లు పక్కన ఒంటి కాలిమీద నుంచున్న తుంపాడి పక్షిని చూసింది. నీళ్లు దాని మోకాలు దాకా వున్నాయి.

''ఓహో! నేను దీన్ని తక్షణం పట్టేస్తాను'' అనుకొంది పప్పీ. ఆ తుంపాడి పక్షి వీపుమీదకి యెగరడానికి అది రెడీగా వుంది.



కాని ఆ తుంపాడి పక్షి పప్పీని చూసి రెల్లులోకి విసవిసా వెళ్లిపోయింది. చెరువుమీదనుంచి గాలి విసురుగా వీస్తోంది. ఆ రెల్లు

వెనక్కీ ముందుకీ
వెనక్కీ ముందుకీ

వంగి వూగులాడుతోంది.



పప్పీ కళ్లముందు గోధుమరంగూ, పసుప్పచ్చ చారలూ

వెనక్కీ ముందుకీ
వెనక్కీ ముందుకీ

కదలాడాయి.

పసుపుపచ్చ, గోధుమగంగు చారల తుంపాడి పక్షి రెల్లులో నుంచుంది. అది

వెనక్కీ ముందుకీ
వెనక్కీ ముందుకీ

వూగులాడుతున్నట్టు నుంచుని వుంది.



పప్పీ చాటంత కళ్లు చేసుకుని అదేలోకం చూసింది. కాని దానికి రెల్లులో వున్న తుంపాడి పక్షి కనపడలేదు.

''హుమ్, తుంపాడి పక్షి నాకు టోకరా యిచ్చింది. వట్టి రెల్లులోకి దూకనా నేను! యింకో పిట్టని పట్టుకుంటా పోయి'' అనుకొంది అది.

అది గుట్టమీదకి పోయి, చుట్టూతా పరకాయించి చూసింది. అక్కడ నేలమీద తురాయి పక్షి కూర్చుని వుంది. ఆ పక్షి తన తురాయిని కొంచెం సేపు విప్పుతూనూ, కొంచెం సేపు ముడుచుకుంటూనూ వినోదిస్తోంది.

''ఆహా! నేను యీ క్షణంలోనే యీ గుట్టమీదనుంచి దానిమీదకి లంఘిస్తాను'' అనుకొంది పప్పీ.

కాని తురాయి పక్షి నేలమీద పడి, రెక్కలు చాచి, తోక విప్పి, ముక్కుని గాలిలో యెత్తింది.

పప్పీ గడ్లప్పగించి చూసింది. అసలు అక్కడ పక్షేదీ. ఒక వంకర సూది పొడుచుకుని ముందుకు వస్తూ వున్న నానా రంగుల పీలిక ఒకటి మాత్రం అక్కడ వుందంతే.

పప్పీకి ఆశ్చర్యం కలిగింది. తురాయి పక్షి యేమైనట్టు?

''యీ రంగుల పీలికని నిజంగా పక్షి అని నేననుకున్నానా? తొందరగా పోతాను, ఓ చిన్న పిట్టని పట్టుకుంటాను'' అని అనుకొందది.

అది ఒక చెట్టు దగ్గరికి ఆర్భాటంగా పోయింది. మరి నిజంగానే ఒక చిన్న పిట్ట ఆ చెట్టు కొమ్మమీద కూర్చుని వుంది. అది వంకరమెడ పిట్ట.

పప్పీ దానికేసి ఒక్క ఉదుటున్న దూకింది. కాని వంకరమెడ పిట్ట చెట్టు తొర్రలోకి పలాయనం చిత్తగించింది.

''ఓహో'' అనుకొంది పప్పీ. ''యిప్పుడు దొరికిందిది నాకు!''

అది తన వెనక కాళ్లమీద లేచి ఆ తొర్రలోకి తొంగి చూసింది. ఆ నల్లని తొర్రలో నల్ల త్రాచు ఒకటి మెలికలు తిరుగుతూ భయంకరంగా బుసకొడుతోంది.

పప్పీ వెనక్కి గెంతింది. దాని బొచ్చు మేకుల్లా బిగిసి పోగా, అది కాలికి బుద్ధి చెప్పింది. వంకరమెడ పిట్ట చెట్టు తొర్రలోనుంచి బుసకొట్టింది. అది తల వంకర తిప్పింది. తన వీపుమీద అంతా తాచుపాములాగా నల్లని యీకల చారని మెలితిప్పింది.

''ఉఫ్! యేం జడుసుకున్నాను! నా కాళ్లు కష్టంమీద సరిగ్గా అదునులో అందుకుని పరిగెత్తాయి! యిక పిట్టల వేటకో నమస్కారం. బల్లిని పట్టుకుంటాను, మెరుగు'' అనుకొంది అది.

బల్లి యెండలో చలికాగుతూ, కళ్లు మూసుకొని, రాతిమీద కూర్చొంది.

మెల్లిగా పప్పీ దాని దగ్గరకి పాకి వెళ్లి, అప్పుడు గెంతి, దాని తోకని లటుక్కున పట్టుకొంది.

బల్లి తన తోకని పప్పీ బిగపట్టిన పళ్ల మధ్య వదిలేసి, ఒక సారి విదిలించుకునిపోయి, రాతి కిందకి పాకి పోయింది.



పప్పీ పళ్ల మధ్య ఆ తోక గిజగిజలాడింది.

పప్పీ కస్సుమని తోకని వదిలేసింది. బల్లిని పట్టుకుందామని వెంబడించింది. యేదీ, అది యెక్కడికి పోయింది? ఆ బల్లి చాలా సేపు రాతి కింద, కొత్త తోకని పెంచుకుంటూ, ప్రశాంతంగా కూర్చుంది.

''సరే, బల్లి నాకు అందకుండా తప్పించుకునిపోతే పోనీ. కొన్ని పురుగుల్ని పట్టుకుంటాను'' అనుకొంది పప్పీ.

అది చుట్టూతా చూసింది. కందిరీగలు నేలమీద పరిగెత్తాయి. గడ్డిలోనుంచి మిడతలు గెంతాయి. కొమ్మల మీద గొంగళీపురుగులు పాకాయి. గాలిలో సీతాకోక చిలకలు ఎగిరాయి.

పప్పీ వాటి వెనక్కాలే పోయింది. కాని వున్నట్టుండి చుట్టూతా ప్రతీదీ మారిపోయింది. అది యేదో మేజిక్ బొమ్మలాగా వుంది: అన్నీ అక్కడనే వున్నాయి, కాని పప్పీకి అవి కనబడ్డం లేదు. ప్రతీదీ దాంకుంది.

మిడత గడ్డిలో దాంకుంది.



గొంగళీపురుగులు కొమ్మలమీద చాచుకుని, ఉలుకూ పలుకూ లేకుండా పడుకున్నాయి. చెట్టు కొమ్మలకీ వాటికీ తేడా తెలియలేదు పప్పీకి.





సీతాకోక చిలకలు రెక్కలు ముడుచుకుని చెట్లమీద వాలాయి. చెట్టు బెరడు యేదో, ఆకులు యేవో, సీతాకోక చిలకలు యేవో చెప్పేందుకు లేదు.

ఒక్క బొంబార్డియర్ కందిరీగ మాత్రం నేలమీద పాకింది. దాంకోలేదు.

పప్పీ దాని వెంటబడింది. దాన్ని లటుక్కున పట్టుకోవాలనుకుంది. కాని బొంబార్డియర్ కందిరీగ తక్కున ఆగి, మురికి నీళ్లని ముక్కులో నుంచి పప్పీ కేసి చయ్యని పిచికారీచేసింది. సరిగా పప్పీ మొహంమీదకి మురికి నీరు పోయింది.

పప్పీ కుయ్యోం మని అరిచి సుళ్లు తిరిగింది. తోక ముడిచేసి పచ్చికమైదానం మీదుగా, గేటు కిందనుంచి, పరిగెత్తింది.

అది తన గూట్లో దాంకుని, చాలా సేపు తన ముట్టెని బయటపెట్టడానికి కూడా భయపడిపోయింది.

కాని ఆ జంతువులూ, పక్షులూ, పురుగులూ మరో సారి, ప్రతీదీ తన సంగతి తను చూసుకుంటూ, తమ పనుల్లోకి వెళ్లిపోయాయి.



అనువాదం: ఆర్వియార్
చిత్రాలు: వి. కిరీల్లొవ్



''రాదుగ'' ప్రచురణాలయం
మాస్కో



**V. Bianki**

THE FIRST HUNT

*In Telugu*

$Б\frac{4803010102-343}{031(01)-84}378-84$